# గీతావాణి

46



నాల్గవ సంవత్సరము  పదవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ [illegible].

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 ఏప్రెల్ 1955.

ఓం

# విషయసూచిక.





## బాష్పాంజలి.

నైజాం యిలాకా కేశవపట్నం బ్రహ్మవిద్యాశ్రమ సంచాలకులు — మా గీతావాణి పత్రికా మహారాజ పోషకులు సాధు శ్రీ పాపయ్యగారు మాఖ బ 3 లు బుధవారం (9-2-55) యిహయాత్ర చాలించినారనిన వార్త మాకు విచారము కల్గించినది. వారి ఆత్మ పరమశాంతి నొందుగాక! ఆశ్రమవాసుల భగవంతు డనుగ్రహించుగాక !!

— సంపాదకుడు.

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు

గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్:

శ్రీరామకృష్ణ

మేనేజరు:

స్వామి శ్రీ శివానంద,

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

సంవత్సరచందా 4—0—0 * విడిపత్రిక 0—6—0.

15 APRIL 1955.

◆◆◆◆◆◆ కవిత ◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

# శ్రీ భగవద్గీతా సారము.

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆ బాలకవి ఓ. నారాయణప్పగారు ◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## పంచదశాధ్యాయము – పురుషోత్తమ ప్రాప్తియోగము

సీ॥ పైకి వేళ్లును క్రిందిప్రక్కకు గొమ్మలు
నవ్యయ యశ్వత్థమనెడి వృక్ష
మది వేదపత్రముల్ యదనుగా మదినెంచి
దెలియువా డేదముల్ దెలియువాడు
త్రిగుణాల వృద్ధిని దగజెంది రాగాది
విషయచిగుళ్లచే వెలసి యధమ
మూర్ధంబునన్ బ్రాకి యొగి కర్మబంధన
మనుజుల బంధించు మానకెపుడు

గీ॥ సరగున నసంగశస్త్రాన నరికి దీని
నరుడు పరమొందు తిరుగడు మరల భువికి
ననె నరునకప్పు డాహరి యనుచు దెల్పు
సకలజనమాత! శ్రీదాత!! సత్యగీత!!!



యుగాలు గడిచాయి. శతాబ్దాలు మారాయి. కాల కామిని రకరకాల దుస్తులు ముడిచింది; విడిచింది. కానీ భగవద్గీతలోని భావపుష్టి – చైతన్యదీప్తి – తేజస్పందనం, రవంతా చెక్కుచెదరలేదు. అది జ్ఞానప్రకాశంతో ధగధగా వెలిగే కోహినూరు వజ్రం. రాత్రింబగళ్లు వెలిగే ధ్రువతార.




సంపుటి 4 ★ స్వస్తిశ్రీ మన్మథ - చైత్రమ్ ★ సంచిక 10

## గీత - నావ; గీతాచార్యుడు - నావికుడు.

సంసారము సముద్రము. ఈ ఉపమానము సుప్రసిద్ధమైనది. సముద్రమున యెడదెరిపిలేని కెరటములు; సంసారమున విధి విరామములేని ఒడుదొడుకులు. సంసారమె పరివర్తన శీలమైనపుడు సంసారజన్య పదార్థములకు పరివర్తనమెట్లు తప్పగలదు? పరివర్తనము తప్పనపుడు ఒడుదొడుకులును తప్పవు.

సంతలో నివసించువాడు రొదాళమునకు జడియరాదు. సముద్రమున పడినవాడు అలలకు భయపడరాదు. సంసారమున నుండువాడు సుఖదుఃఖములకు వెఱువరాదు. సుఖదుఃఖాది ద్వంద్వ స్వరూపమె సంసారము. గడియారములోని పెండులమువలె సుఖదుఃఖము లూపినట్లూగువారికి చరిత్రలో స్థానము లేదు; లోకములో విజయము లేదు; జన్మమునకు ఉద్ధారకము లేదు.

పశువువలె జడప్రకృతికి బానిసయై బ్రతుకుటకు నరజన్మము రాలేదు. నరత్వములో నారాయణత్వమును సాధించి తాను ప్రకృతికి ప్రభువు కావలెను. తనపాలిటబడిన సంసారసముద్రములో నరుడై మునుగరాదు; నారాయణుడై తేలవలెను. మునిగినవాని కిది క్షార సముద్రము; తేలినవానికి క్షీరసముద్రము.

నారాయణుడై సంసారసముద్రమున తేలుట జ్ఞానమార్గము. నారాయణు నాశ్రయించి సంసార సముద్రమును తరించుట భక్తి మార్గము. ఫలిత మిద్దరికిని ఒక్కటియె. సంసార భయవిముక్తి యిద్ద రికిని సిద్ధమె. అధికారభేదమునుబట్టి గీత రెండుమార్గములను ప్రతిపా దించినది. మొదటి జ్ఞానమార్గము క్లేశాధికతరము. రెండవదగు భక్తి మార్గము సులువని అంత చులకనగ చెప్పరాదు; కాని మొదటి దానికంటె అల్పక్లేశయుతము. దృక్స్థానముననిలిచి అసంగభావము నవలంబించి దృశ్యప్రపంచము నువ్వెత్తుగ నూదివైవగల్గెడి ఉత్త మాధికారులకంటె మంద మధ్యమాధికారుల సంఖ్యయె లోకమున బహుళము. అట్టివారి కభయదాన మొసగుచు దయామయులగు పూర్వీకఋషులు హితసందేశ మొసగినారు.

శ్లో॥ సంసారసాగరం ఘోరం - తర్తుమిచ్ఛతి యో నరః ।
గీతానావం సమాసాద్య - పారం యాతి సుఖేన సః ॥

ఘోర సంసారసాగరమును దాటగోరువాడు గీతను తనకు నావగ చేసికొనవలెను. గీతా జ్ఞానగర్భమున తాను నివసించవలెను. నావ దొరికినంతమాత్రముననె లాభములేదు; సమర్థుడగు నావికుడు కూడ లభించవలెను. ఎట్టెట్టి విపత్తులలో సైతము ప్రయాణీకులను రక్షింపగల్గెడి 'కెప్టెన్' కావలెను. ప్రమాదపరిస్థితులలో సముద్ర మున దుమికియైనను పతితుల నుద్ధారక మొనర్చెడి ప్రభువు నాశ్ర యించవలెను. పాండవులకు లభించిన కైవర్తకుడు కేశవుడు మన జీవితనౌకకు పాలకుడు కావలెను.

"తేషామహం సముద్ధర్తా" _ అనెడి భగవంతుని ప్రతినపై శ్రద్ధనుంచుడు. శ్రద్ధయె భక్తునకు అధికారి లక్షణము. శ్రద్ధతో సిద్ధి బొందుటకు ఏకలవ్యుడు సాక్షి. మృత్యు సంసారసాగర కల్లోలముల కిక వెఱువవలసిన పనిలేదు, మరొక్కసారి యెలుగెత్తి పలుకుదము _

గీత మనకు నావ –
గీతాచార్యుడు నావికుడు.

★




(గతసంచిక 7_వ పుట తరువాయి.)



నాల్గవ అధ్యాయము యిర్వది తొమ్మిదవ శ్లోకమువరకు చెప్పుకొని యున్నాము. తదనంతర శ్లోకమున భగవంతుడు ఆహారనియతినిగూర్చి బోధించుచున్నాడు.

"అర్జునా! మరికొందరు ఆహార నియమమును పాటించి ప్రాణము లను ప్రాణములలో హోమము చేయుచుందురు. ద్వాదశవిధముల పైన జెప్పినవారందరును యజ్ఞ వేత్తలే. వీరు యజ్ఞాచరణమువలన సమస్తకిల్బిషములను ఉన్మూలించు కొన్నారు."

ప్రాణాయామ ప్రక్రియ నాచ రించునపుడు ఆహార నియమ మత్యగత్యమై యుండును. యోగ శాస్త్ర మీ విషయమున చెప్పున దేమనిన — ఉదరకోశమును సగ భాగము అన్నముతో నింపవలెను. పాతికభాగము నీటితో నింపవలయు. మిగత పాతికభాగము వాయుసంచా రముకొరకు బిడువుగ నుంచవలెను. ఈ పద్ధతిని పాటించియె రేచక పూరక కుంభక రూపమగు ప్రాణాయామ మొనర్పవలెనని యోగశాస్త్ర మర్యాద. గతశ్లోకమున చెప్పినట్లు త్రివిధరూప ప్రాణాయామము నొన ర్చువారేగాక మరికొందరు ప్రాణ ములను ప్రాణములందు హోమము జేయువారును కలరు. ఇంద్రియము లన్నియు ప్రాణాధీనము లయ్యే యుండును. కళ్లెములను బిగించినంత గుఱ్ఱము లాగిపోవునట్లు ప్రాణముల నిగ్రహించుటతో యింద్రియములు స్తంభించగలవు. తమతమ చేష్టలతో యింద్రియములు నిలిచి నంతట సర్వేంద్రియ నిగ్రహామేర్పడుచున్నది అదియె ధారణాయోగ మందురు.

"ధనంజయా! యజ్ఞములు చేయగ మిగిలిన అమృతరూపమగు ఆహారమును భుజించెడి ఆ పుణ్యా త్ములు సనాతన సత్య పరబ్రహ్మ

మును బొందుచున్నారు. ఈ పది రెండింటియం దేయొక్కటియైనను ఆచరింపనివానికి యిహమె సున్న యన్నచో పరము మాటెందుకు?"

పూర్వోక్తములగు ద్వాదశ యజ్ఞములను గురుశాస్త్రోపదేశరీతి నెఱింగి, విధిపూర్వకముగ శ్రద్ధాభక్తి పురస్సరముగ నాచరించెడి వారికి యజ్ఞవేత్తలని పేరు. వారు యజ్ఞరహస్యములను గుర్తించి యున్నారు. యజ్ఞానుష్ఠానముతో పాపములను కడద్రోసినారు. యజ్ఞశిష్టామృతమును భుజించి అంతఃకరణ శుద్ధినిబొంది జ్ఞానద్వారమున నిత్యబ్రహ్మమును పడసియున్నారు. వారు జన్మమరణ సంసారమునుండి విముక్తులైనారని యర్థము.

అయజ్ఞులన నెవరు? పైన పేర్కొన్న పదిరెండు యజ్ఞములలో నేదొక్కటియైనను ఆచరింపనివారు అయజ్ఞు లనబడుదురు. వారికి అల్ప సుఖదాయకమగు మనుష్యలోకమె సిద్ధింపజాలదనినచో మహాపుణ్యాముసకాని లభింపని స్వర్గలోకమే విధమున సిద్ధింపగలదు?

23-వ శ్లోకమునుండి 30-వ శ్లోకమువరకును తెలిన సారాంశమేమనిన — మనుష్యుడు వేదవిహితమగు కర్తవ్యకర్మ నొనర్చవలెను, అట్టిది యజ్ఞమనబడును. అది ఒక్క విధమెకాదు. ప్రాణాయామ మొక యజ్ఞము. వేదాధ్యయన మొక యజ్ఞము. తత్త్వవిచార మొనర్చుట యొక యజ్ఞము. ఆజ్యాది సామగ్రుల నగ్నిలో వేల్చుట నొక యజ్ఞము. పూజాపాఠముల నాచరించుట యజ్ఞము. బలి వైశ్వదేవాదికములు యజ్ఞములు. ద్రవ్యయజ్ఞపరు నొక్కనినె యాజ్ఞికుడని గీతచెప్పదు. పై జెప్పిన వ్రతనియమముల నాచరించువారందరును యాజ్ఞికులే. అంతేగాక, "యజ్ఞార్థమై చేయబడిన కర్మము బంధకముకాదు" అనెడి మీమాంసకుల సిద్ధాంతము గీతకుకూడ సమ్మతము. ఈ నియమమును గీతాచార్యుడు మూడవ అధ్యాయము తొమ్మిదవ శ్లోకమునందును, ఆరవఅధ్యాయము యిరవై మూడవ శ్లోకమునందును స్పష్టపరచి యున్నాడు. గృహస్థుడు ప్రతివాడును పంచయజ్ఞముల నాచరించి అతిథి భుజించిన తదుపరి భుజించినచో వాడు సద్గతి బొందుననియు, అట్టివాని గృహస్థాశ్రమము సఫలమగుననియు శాస్త్రవాక్యముకూడ గలదు.

"విఘసంభుక్తశేషం తు
యజ్ఞశేషమథామృతమ్."

అతిథి భుజించిన పిదప మిగిలిన భోజనమును 'విఘస' మందురు. యజ్ఞశేషము అమృత మనబడును. విఘసమును — అమృతమును గృహస్థులకు శ్రేయస్కరమైనవి. అటుగాక కేవలము తన పొట్టకై తినువాడు పాపమునె తినుచున్నాడని తెలియవలెను. అట్టివానిని "అఘాశి" యని గీతయు వేదమును మనుస్మృతియు పేర్కొన్నవి. ఈ సిద్ధాంతము సామాన్యముగ గృహాయజ్ఞమునకె సంబంధించిలేదు; పైజెప్పిన సమస్తయజ్ఞములకును సంబంధించినది. యజ్ఞార్థకర్మము బంధకము గాదనియు, యజ్ఞహీనునకు ఉభయలోకములు సిద్ధింపవనియు చెప్పినమాట అర్థపూర్ణమైనది. మనుష్యుడు తన స్వాతంత్ర్యము యొక్కయు, స్వార్థముయొక్కయు కొంత భాగమును అనివార్యముగ లోకమునకై — సమాజమునకై త్యజింపక తప్పదని దీని రహస్యము. (సశేషము)

## ఉపకారస్మరణ.



మా గీతావాణి కార్యాలయమునకు "శ్రీ భగవద్గీతా పరమార్థచంద్రిక" (రు. 15/-లు వెలగల — పూర్వార్థము) 3 సంపుటముల పవిత్రగ్రంథమును, నెల్లూరుజిల్లా నెల్లూరు తా॥ కనుపర్తిపాడు గ్రామ కాపురస్థులగు శ్రీమతి పల్లంరెడ్డి వెంకటసుబ్బమ్మగారు, దివంగతులగు తమ తలిదండ్రులు శ్రీపొన్నవోలు నారాయణరెడ్డి — పుల్లమ్మగారి స్మరణార్థముగ సమర్పించియున్నారు. పరమేశ్వరుడు వారి జననీజనకులకు ఆత్మసుఖమును కల్గజేయును గాక!

ఇట్లు,

— సంపాదకుడు.




విద్వాన్ – శ్రీఘూళీ కృష్ణమూర్త్యాచార్యులు, బళ్లారి.



(ఫిబ్రవరి సంచిక 18 పేజి తరువాయి)

**శ్లో॥ తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః।**
**సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములో౽భవత్ ।** 13

తా॥ తరువాత భీష్ముని సంకేతమునసుసరించి సేనానాయకులందరు తమ శంఖముల నూదిరి. మరియు భేరీదుందుభులుకూడ వాయింపబడెను. వానిధ్వని యెల్లెడల వ్యాపించెను.

వి॥ పాండవులు గంభీరముగా మహానదివలెను, కౌరవులు దుర్బలులుగాన ఝరివలెను కోలాహల మొనర్చిరి.

అ॥ పాండవసేనలో నడచిన వృత్తాంతమును సంజయుడు వర్ణించుచున్నాడు:

**శ్లో॥ తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ ।**
**మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః ॥** 14

తా॥ అప్పుడు తెల్లనిగుఱ్ఱముల బూన్చిన దివ్యరథమున గూర్చుండిన లక్ష్మీపతియగు కృష్ణుడును, అర్జునుడును తమ శంఖముల నూదిరి.

వి॥ మాధవుడు అనగా లక్ష్మీపతి; తన కితరులు ప్రభువులు లేరు. తానే అందరికి స్వామి. మధువను యాదవరాజు వంశమున ప్రాదుర్భవించినవాడు. ఇట్టి కృష్ణుడు నేతగా ధర్మయుద్ధమున పాల్గొను నర్జునుని భాగ్యమెంతని చెప్పగును! పాండవులలో కృష్ణుని సారథిగాగల అర్జునుడు రథమునందు కూర్చొనియే భగవంతుడగునతడు శంఖధ్వాన మొనర్చినంతనే తానును శంఖనాద మొనర్చెను. నీ కొడుకగు దుర్యోధనునివలె రథము దిగివచ్చి అన్యుల శరణాగతి పొందలేదు. అర్జునుని రథము దివ్యము. అగ్నిచే నివ్వబడినది. దాని పేరు నందిఘోషము (భారత–కర్ణ–71అ). దానికి సారథి సకల జగమును సంకల్పమాత్రముచే సంహారము చేయగల సామర్థ్యముగల కృష్ణరూపీ పరమాత్మ. కౌరవపాండవులలో యుద్ధప్రవృత్తిని గల్పించి అతడు సారథియైనది కేవల లోకోద్ధారార్థమై అర్జునుని నెపముచే తన హృదయాకాశస్థిత గీతాభానుని ప్రకాశమునావిష్కరింపజేయుటకే. అపౌరుషేయము, నిత్యము, నిర్దోషమునగు వేదరాశి చెప్పు జ్ఞానమునకు సాధనమును, పౌరుషేయగ్రంథములలో శ్రేష్ఠమునగు గీతాశాస్త్రమునకు

నరనారాయణావతారులగు పార్థకృష్ణులే గురుశిష్యభావము పొందిరి. శుద్ధములగు ఇంద్రియముల నెడు గుఱ్ఱములు పూన్చిన ఐహిక పారత్రిక సుఖసాధనమగు దేహమను రథమున (కాఠక 3_3; 4.) ముఖ్యాముఖ్య క్షేత్రజ్ఞులై వసించిన (గీ 13_3) పరమాత్మయగు శ్రీకృష్ణుడును, ఉత్తమ జీవుడగు నర్జునుడునూ గురుశిష్య విచారరూపమున ప్రణవార్థము నుపదేశించిరి.

శ్లో॥ పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ 15

తా॥ ఇంద్రియస్వామియగు కృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును, భయంకర కార్యములు చేయగల తోడేలువంటి కడుపుగల భీముడు పౌండ్రము నను శంఖములఁ బూరించిరి.

వి॥ కృష్ణుడు తన గురుపుత్రుని మృత్యులోకమునుండి బ్రతికించి తే నరిగినప్పుడు పంచజనుడను రక్కసుని చంపి వానికడుపులోని పాంచజన్యమను శంఖమును స్వీకరించెను (హరివంశము 33). నివాతకవచుల గెలిచినప్పుడు దేవత లర్జునుని మెచ్చి వానికిచ్చిన శంఖము దేవదత్తము. హృషీకేశుడనుటచే అందరిని ప్రేరేపించు సృష్ట్యాద్యష్టకర్త యనియు, ధనంజయుఁడనుటచే గెలువ సమర్థుడనియు సూచితము. మరియు 'వృక' యను నగ్నిని కడుపునందు గలిగి, బలిష్ఠుడై, హిడింబ, బక, కిర్మీర, కీచకాది దుష్ట దైత్యులను సంహరించిన భయంకర సాహసియగు భీముడు గొప్ప శంఖము నూదెనని యుఁ సూచితము.

శ్లో॥ అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ ॥ 16

తా॥ ధర్మరాజు అనంత విజయము, నకుల సహదేవులు సుఘోషము, మణిపుష్పకము నను శంఖము లూదిరి.

వి॥ రాజా = రాజగుటకు అర్హుడగు ధర్మరాజు తప్పక విజయమును తెచ్చియిచ్చు 'అనంత విజయ'ము నూదెను. అతడు యుద్ధము వలదన్నమాట నిజమే. కాని యుద్ధమునకు నిల్చెనా, యాతని నెవరు గెలువలేరు. అందుననే అతడు యుధిష్ఠిరుడు. పాండవులు ద్వైతవనమున వనవాసముండగా పదుమూడు నెలలాయెను. అప్పుడు ద్రౌపదియు, భీమార్జునులు నిట్లనిరి. "వనవాసమిక చాలును. వేదమొప్పినరీతిగా 13 నెలలును 13 వర్షములకు సమానము. కాన నిప్పుడే హస్తినముఁజేరి, కౌరవులను యుద్ధమున నోడించి, సుఖముగా రాజ్యమేలుదమని" చెప్పగా ధర్మరాజిట్లనియె. "అది సరికాదు; కౌరవుల ఇచ్చచొప్పున 13 యేండ్లు గడపుడు. 14వ సంవత్సరారంభమున మీ ఇచ్ఛ చొప్పున నడువుడు. నేనప్పుడు ఆటంకము చెప్పను." అని ప్రతిజ్ఞచేసిన చొప్పున (భావన) సత్యప్రతిజ్ఞుడై, ఇప్పుడు యుద్ధమున స్థిరముగా నిలిచి, కౌరవసేనలో భీతిని కలిగించుచు శంఖనాద మొనర్చెను.

శ్లో॥ కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః॥ 17
శ్లో॥ ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే।
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్॥ 18

తా॥ కాశీరాజు, శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపది పుత్రులు, అభిమన్యుడు — ఇట్లందరు నొకే కాలమున తమ తమ శంఖములను పూరించిరి.

శ్లో॥ స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥ 19

తా॥ ఆ శంఖముల భయంకర ధ్వని భూనభోంతరముల ప్రతిధ్వనించుచు, ధృతరాష్ట్రుని కొడుకు సైన్యముల మనమును అథవా పక్షమును భేదించెను. అనగా వారు గుండెలు పగిలిరి.

వి॥ ధార్తరాష్ట్రులలో నందరి యెదచీల్చినంత దుఃఖమాయెను. వారిలో పాండవుల నెదురించగల ధైర్యవంతు డొక్కడు లేడని యర్థము.

12, 13 శ్లోకములలో చెప్పినట్లు భీష్మాదుల శంఖధ్వనులు పాండవసేనను కలగుండు పఱచెనా? అన్న లేదు. ఆ శబ్దము హర్షము పుట్టించుటకయ్యే కాని పాండవుల శంఖధ్వానమువలె హృదయ విదారకమని వర్ణింపబడలేదు. అంతేకాక పాండవ శంఖారావములు దుర్యోధన పక్షమునందలి దుర్జనులకు హృదయ విదారకమైనది కాని భీష్మ ద్రోణాది సజ్జనులకును, ఇంద్రాది దేవతలకును హర్షమునే పుట్టించినవి. దుర్యోధన పక్షమువారు "మేమింక జచ్చితిమి! గెలుచుట కల్ల" యని నిశ్చయించి యోచించిరి.

శ్లో॥ అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః॥ 20
శ్లో॥ హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే।
సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥ 21

తా॥ అప్పుడు హనుమంతుడు వచ్చి ధ్వజమున నిలువగా అర్జునుడు చక్కగా నిలిచిన దుర్యోధనాది శత్రువుల జూచెను. శస్త్రాస్త్రప్రయోగముతోడి యుద్ధమును ప్రారంభమగుచుండెను. అర్జునుడు ధనుస్సునెత్తి శ్రీకృష్ణునితో నిట్లనెను. "నాశరహితుడగు శ్రీకృష్ణా! నా రథమును రెండు సేనల మధ్య నిలుపుమా!"

వి॥ లోకోద్ధారమునకై అర్జునుని నెపమున నుపదేశింపఁబూనిన గీతాశాస్త్రము శ్రీకృష్ణహృదయమునుండి వెడలుటకిదే మంచిసమయమనియే శ్రీకృష్ణుడు యుద్ధ ప్రారంభ

మున సంశయము — దానివలన ప్రశ్న — కలుగుటకై సారథిగానుండి యర్జునుని ప్రేరేపించెను. అర్జునుడు, నరుడు, ఇంద్రుడు వీరియంశమున బుట్టినవాడు. తనకు మేనత్త కొడుకు – చెల్లెలిమగడు – పరమభక్తుడు (గీ 4_3) కాన అతనికంటె గీతోపదేశమునకు యోగ్యుడెవ్వడును లేడు.

ఈ యర్జునుడన్నను “అతి పరిచయాదవజ్ఞా”యను నీతి ననుసరించి (11_41; 44) అర్జునుడవమానముచే శిష్యుడు కాలేడు. శిష్యుడుకాక అతని కుపదేశించుట యోగ్యము కాదు. కాన “నేను నీ శిష్యుడను — నాకు గీతాశాస్త్రము నుపదేశింపుము. (శాధి మాం)” అని ప్రపన్నుడై ప్రార్థించిన తరువాతనే గీత నతని కుపదేశింపదగును. అర్జునునిలో వైరాగ్యము పుట్టువఱకు అతడు తన్నుఁజేరి ప్రార్థింపడు. శోకమోహములో, తమకు ప్రియులైనవారికి సంభవించు దుఃఖమును చూచియో లేక అట్టి దుఃఖానుసంధానము చేతనో కలుగుచున్నవి. కనుక శ్రీకృష్ణుడు బంధువుల వియోగముచే పుట్టగల దుఃఖాను సంధానముచే శోకమోహములను, అవియే కారణమై జనించు వైరాగ్యమును పుట్టించి అర్జునుని శిష్యునిగా నొనర్చుకొని అతనిచే ప్రార్థితుడై గీతాశాస్త్రము నతని కుపదేశింప వలెనని సమయము వేచి సంధిచేయు నెపముచే కౌరవులఁజేరి, అమృతాయనములగు తన మాటల వాడు వినమింజేసి యుద్ధము నిశ్చయించెను. యోగ్యకాలమున ఆయాసము లేక గీతోపదేశ మర్జునాది సజ్జనులకు జరుగవలెననియే సారథియై రథమందే సారథిగా కూర్చుండి యుద్ధోత్సాహము కలిగించెను. కాని యుద్ధప్రారంభమున బంధుదర్శనముచే అర్జునునిలో మోహశోకములను మనోవ్యాకులతను పుట్టించెను. తన్నివారణమునకై గీతా శాస్త్రముపదేశింపవలసివచ్చెను. ఆ యుపదేశముచే వర్ణాశ్రమోచిత కర్మానుష్ఠానముచే అంతఃకరణశుద్ధియు అందుపై అపరోక్షజ్ఞానమును కలిగి మోక్షము సిద్ధించుననియు నిరూపించెను.

భీష్మాదులు యుద్ధసన్నద్ధులైయుండిరి. గాండీవపాణియు, భీమానుజుడునగు నర్జునుడును నారిజోడించి బాణము తొడిగెను. కాన యుద్ధమున ప్రవృత్తిలేనందువల్ల గీతోపదేశము జరుగవలసివచ్చెననుట సరికాదు. పరమాత్మ ప్రేరణచేతనే ప్రవర్తించలేదని తెలియదగును. కాననే శస్త్రాస్త్ర ప్రయోగములతోడ శంఖధ్వానములతోడ ప్రారంభింపఁదగిన యుద్ధమటునిలిపి సకలేంద్రియ ప్రేరకుడగు భగవంతుని ప్రేరణచే సేనల మధ్యనా రథము నిలుపని వేడెను. ఇందు మొదటి ప్రయోజనమేమన, యుద్ధమునకు వచ్చిన నానావీరుల పర్యవేక్షణము. దానిచే మోహము పుట్టి, తన్నిరాసమునకై పరబ్రహ్మ విషయక తత్త్వోపదేశమువలన సకల లోకోద్ధారము అనునదే ముఖ్యమగు నింకొక ప్రయోజనము. దేశకాల గుణములచే చ్యుతిలేనందున విష్ణువనవతారమగు నిన్ను పొందిన నాకు నాశరహితమగు సకల పురుషార్థములు సిద్ధించును. నిజము.

అ॥ కారణము చెప్పి ప్రార్థించుచున్నాడు:

శ్లో॥ యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్రణసముద్యమే ॥ 22

తా॥ ఈ రణకర్మలో నేనెవరితో యుద్ధమాడవలయునో, మరియు నెవరెవరు నాతో సంగరమాడగోరి వచ్చియున్నారో, వారిని చూచువరకు రథమును నిలుపుము.

వి॥ నాతో గూడి నా శత్రువుల నెదిరించి యుద్ధమునకు తోడ్పడవచ్చినవారిని, శత్రు పక్షములో నెవరితో నేను యుద్ధము చేయరాదో అట్టి పూజ్యులనుకూడ గుర్తించుటకు తగినట్టి స్థలములో ఈ నా రథమును నిలుపుము.

అ॥ ఎందుకీ త్వర? అనగా అర్జునుడు చెప్పుచున్నాడు:-

శ్లో॥ యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేః యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23

తా॥ దుష్టబుద్ధిగల దుర్యోధనునికి హితము కలుగఁజేయువలెనను బుద్ధితో యుద్ధమునకై ఎవరెవరు శత్రుపక్షమున వచ్చియున్నారో వారిని చూడగోరుచున్నాను.

వి॥ యుద్ధే ప్రియ చికీర్షవులు = దుర్యోధన పక్షమువారు యుద్ధేఽప్రియచికీర్షవులు = దుర్యోధనునికి అహితము గోరు మావారినికూడ చూచెదను. ఇప్పుడే ఎవరితో యుద్ధమాడవలెను, ఎవరితో నాడరాదో నిశ్చయించుకొనుటకై ఈ తొందర. యుద్ధారంభమైన తరువాత నది సాధ్యము కాదు. భీష్మాదులు దుర్యోధనునియందు నిష్కపట ప్రీతితో యుద్ధమునకు వచ్చినారేకాని మాయందు వారికి ద్వేషము లేదు. దుర్యోధనుడే దుర్బుద్ధి. కాన వారందరిని చూడగోరుచున్నానని అర్జునుడు ప్రార్థించగా శ్రీకృష్ణుడట్లే చేసెను.

సంజయ ఉవాచ:—

శ్లో॥ ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమం ॥ 24

శ్లో॥ భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితాం ।
ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి ॥ 25

తా॥ ఓ ధృతరాష్ట్ర! నిద్రను అనగా అజ్ఞానమును గెలిచిన అర్జునుడిట్లు ప్రార్థించగా శ్రీకృష్ణుడు రెండు సేనల మధ్య ఆ దివ్యరథమును నిలిపి "అర్జునా! కౌరవులు, వారివారు, మావారు అందరు కురుక్షేత్రమున వచ్చియున్నారు. చూడుము"ని భీష్మ ద్రోణాదులు ప్రముఖులగు రాజుల సమక్షమున నే చెప్పెను.

వి॥ శంతనుపుత్రుడు – చక్రవర్తియైనట్టి భరతవంశమున బుట్టిన ధృతరాష్ట్రా! దురాచారుడవగు నీకొడుకునిమిత్తమై యతిస్నేహముచే పవిత్రులగు పాండవులతో ద్వేషించుట అయుక్తమని సూచింపబడినది. శ్రీకృష్ణుడు భీష్మద్రోణాదుల సమక్షముననే నిర్భయముగా రథమును నిలబెట్టి వారి నర్జునునికి చూపించెనను అనాదరమును షష్ఠీ విభక్తి (సేనయోః) చూపుచున్నది. అర్జును డాజ్ఞాపింపలేదు. కృష్ణుడు సామాన్యసారథివలె అనువర్తింపలేదు తన యిచ్ఛచేతనే సారథియైనాడు భగవంతుడు. అతని ప్రేరణచేతనే అట్లు ప్రార్థించినాడు పార్థుడు.

అ॥ అప్పుడర్జును డేమిచేసెననుటను చెప్పుచున్నాడు:

శ్లో॥ తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్మాతులాన్భ్రాతౄన్ పుత్రాన్పౌత్రాన్సఖీంస్తథా ॥26

శ్లో॥ శ్వశురాన్సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।
తాన్సమీక్ష్య స కౌన్తేయః సర్వాన్ బన్ధూనవస్థితాన్ ॥ 27
కృపయా పరయాఽఽవిష్టో విషీదన్నిదమబ్రవీత్ ।

తా॥ అప్పుడర్జునుడు యుద్ధసన్నద్ధులగు పితృపితామహులకు సములగువారిని, ఆచార్యులను, మేనమామలను, అన్నదమ్ములను, పుత్రపౌత్రులను, మిత్రులను, మామలను, నిర్వ్యాజస్నేహితులను చూచెను. ఇట్లు రెండు సేనలలోనున్న బంధువులను చూచి అతికనికరముతో గూడినవాడై దుఃఖముతో నిట్లనెను.

వి॥ 'కృపా' యనగా అన్యులదుఃఖమును సహింపజాలకపోవుట. 'విషాదః' మనగా మోహమూలకమగు దుఃఖముచే మనస్సు క్షీణించగా సకల వ్యాపారములు నిలిచిపోవు అవస్థ (2-3) 'కృపావిష్ట' అనుటచే పిశాచాదు లావేశించునట్లు పరవశుడై అసంబద్ధము లాడెననియు, కనికరము దుర్యోధనాదులందు చూపరానిదయ్యు, బలాత్కారముగా నతనిలో ప్రవేశించెననియు సూచితము. 'విషీదన్' అనుటచే మాటలాడునపుడు కన్నీరు, వణకుట, గద్గదికములునను దుఃఖచిహ్నములుకూడ కనబడెనని తెలియుచున్నది.

అర్జున ఉవాచ:—

శ్లో॥ దృష్ట్వేమం స్వజనం కృష్ణ! యుయుత్సుం సముపస్థితమ్॥ 28
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
,, వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥ 29
గాణ్డీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే ।
,, న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥ 30

తా॥ ప్రాణులను యథాయోగ్యముగా స్వర్గనరకాదులవంక కీడ్చుటచే కృష్ణుడను పేరుగల భగవన్! యుద్ధమునకై వచ్చి నాకు సమీపమున కనబడుచున్న రెండు సేనలలోని స్వజనులను చూచి నా అంగములు బలహీనమైనవి. ముఖము వాడుచున్నది. దేహమున వణకు కలిగినది. శరీరము రోమాంచితమైనది. గాండీవ ధనువు చేతినుండి జారిపడు చున్నది. కాయము కాలుచున్నట్లున్నది. కాన నేను నిలువ సమర్థుడను కాకున్నాను. నా మనము భ్రాంతిచే చంచలమైనది.

వి॥ భ్రాంతిచే విపరీతజ్ఞానము, కుకల్పనలు కలుగును. అనగా మనస్సు ఒక ఆలోచనలో స్థిరముగా క్షణమైన నిలువదు. నీవో పూర్ణానంద స్వరూపుడవు — కృషి = పూర్ణమైన, ణ = ఆనందము (భా-ఉ 69) కనుక నీకు దుఃఖము లేదు. అట్టి నీవు కర్షణాత్ కృష్ణః (కూ. పు.) జీవులను వారి పుణ్యపాపములకు దగినట్లు స్వర్గనరకాదుల వంక కీడ్చువాడవు. భీష్మాదులను సంహరించిన పాపము కలుగుట సిద్ధము. ఆ పాపముచే నరకము తప్పదు. కాన నీవు యుద్ధమునకై నన్ను ప్రేరేపించి నరకమున ద్రోయుట యోగ్యమా? మరియు భక్తుల దుఃఖమును సహింపని నీవు నాకు దుఃఖము కలుగజేయు యుద్ధకార్యమున నేల ప్రేరేపింతువు? నామనమిప్పుడు బంధునాశాలోచనముచేత మోహ, కనికర, దుఃఖములను పొందియున్నది. యుద్ధమునకు చాలను. నీకు సారథ్య కర్మచే కలుగు ఆయాసాదులచే నీ సుందరదేహమును కలత నొందపకుము. ఇంటికి తిరిగి పోవుదమని అర్జునుడు చెప్పగా కృష్ణుడు "అర్జునా! ఇదేమి? ఈ కాలమున నీకీ యవస్థ తగదు. ధైర్యముతో యుద్ధమాడి శ్రేయమును బొందుము. అనగా అర్జునుడు చెప్పుచున్నాడు.

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।

తా॥ కృష్ణా! నాకీ అశుభ శకునముల చూచి ధైర్యము కలుగదు. నే నేమి చేయుదును?

వి॥ యుద్ధముచే కులనాశనమగునని ఈ యశుభ శకునములు సూచించుచున్నవి. కేశవా! లక్ష్మీబ్రహ్మ రుద్రులకు ప్రేరకా! సుఖరూపీ! భక్తసుఖదాయీ! సకల లోకోద్ధారకా! క్షీరసాగరశాయీ! ఈ దుర్యోధనాది దుష్టభ్రష్టుల సంహారముచేసి భూభారముదింపుట నీకు అనాయాస సాధ్యము. కాన ఈయుద్ధకార్యమున నన్నేల నిర్బంధించుచున్నావు? అనగా కృష్ణుడు "ఈ అపశకునముల లెక్కింపకుము. క్షేమము కలుగుట నిశ్చయము. అపశకునఫలము మీ శత్రులకే. మీకు జయము సిద్ధము. శోకింపకుము." అనగా అర్జునుడు చెప్పుచున్నాడు. [సశేషము.]

ఆంధ్ర వసుంధరలో

## సన్మాన్య గీతాజ్ఞాననిధి VI

# శ్రీ K. సచ్చిదానందమూర్తిగారు M.A., (Ph. D.)

రచన: శ్రీమతి K. వేదవతీదేవిగారు.

[ఆంధ్ర విశ్వవిద్యాలయ తత్త్వశాస్త్రోపన్యాసకులగు శ్రీ కె. సచ్చిదానందమూర్తి గారు ఆంధ్రావనియందొక ఉన్నతమగు దీపస్తంభము. గీతావాణి పాఠకులకు ఆ ప్రజ్ఞాశాలినిగూర్చి ప్రత్యేకముగ పరిచయము చేయవలసిన పనిలేదు. నేడు ఆతని కీర్తికాంతను యావత్ప్రపంచము క్రీడారంగమైనది. ఆ యశస్వి జీవితగాధను విపులముగ వ్రాసిపంపిన శ్రీమతి విదుషీమణికి మా కృతజ్ఞతలు. - సం.]

శ్రీ సచ్చిదానందమూర్తి 1924 లో గూంటూరుజిల్లాలో మధ్య వర్గీయ భూస్వామి కుటుంబంలో జన్మించారు. వారి తండ్రికి వేదాంత మందు అభిరుచి చాలహెచ్చు. తెలుగులో దొఱకు వేదాంతగ్రంథా లన్ని వారు చదివారు. చిన్నతనానే వేదాంతముపై తనకున్న ప్రేమను పుత్రునకుకూడ అల వర్చారు. 5 ఏండ్ల ప్రాయానికే సచ్చిదానందమూర్తి రామాయణ, భారత, భాగవతకథలు అనర్గళంగా చెప్పగల్గేవారు; "ద్వాసుపర్ణాసయుజా సఖాయ" అను ఉపనిషన్మంత్ర ములో చెప్పబడిన ఒకే చెట్టుయొక్క పై కొమ్మ, క్రిందకొమ్మల పై నున్న పక్షులకథ చెప్పగల్గేవారు.

5 వ ఏటనే మహాపండితులగు పరవస్తు రంగాచార్యులవారి శిష్యులగు గడియారం శివయ్యశాస్త్రులు



గారు, శ్రీ సచ్చిదానందమూర్తికి సంస్కృత అక్షరాలు విద్యాభ్యాసం చేయించారు. తెలుగు అక్షరాలు ఆయన కెవరు ఎన్నడు దిద్దబెట్ట లేదు; తెలుగు ఎవరూ నేర్పనూ

లేదు. క్రమంగా ఆయనే ఆ భాషను నేర్చుకొన్నారు. 7 వ ఏటనే మరొక శాస్త్రి ఆయనకు హిందీ నేర్ప సాగాడు. 12 వ ఏటలోనే ఆయన దక్షిణభారత హిందీప్రచార సభ వారి 'విశారద' పరీక్ష ప్యాసయి నారు. 9 వ ఏట తల్లిదండ్రులతో పాటు కాశీ-హరిద్వారాది ఉత్తరదేశ క్షేత్రాలన్నీ చూచారు. అయోధ్యలో హిందీవచనంలో వ్రాయబడ్డ రామాయణ, మహాభారత, భాగవత, భగవద్గీతా గ్రంథములు సేకరించుకువచ్చారు. 11, 12 ఏండ్లలో వాటి నన్నిటిని సాంగంగాచదివారు. 11 వ ఏట గుంటూరు టౌను హై స్కూలు లో విద్యార్థిగా సెకండుఫారంలో చేరారు. సెకండు థర్డుఫారములలో ఆయనకు ప్రయివేటు చెప్పటానికి శ్రీ పెండ్యాల రామసుబ్బయ్యగారు ఏర్పాటైనారు. రామసుబ్బయ్యగారు కొంచెం ప్రత్యేకతగల వ్యక్తి. మాటలోను నడవడిలోను ఆయన చాల కఠినుడు, కరుకు. వావిలికొలను సుబ్బారావుగారి భక్తిమార్గానుయాయి. గుంటూరులోని సీతారామనామ సంకీర్తనసంఘ ప్రారంభకుల్లోఒకరు. యోగాసనాలు, ప్రాణాయామం— ఇవి ఆయనకు చాలబాగా అభ్యాసం. లోనవాలోని కువలయానంద స్వామి వ్రాసిన గ్రంథాలు, హఠయోగ ప్రదీపిక, హృషీకేశములోని స్వామి శివానంద వ్రాసిన గ్రంథాలు రామసుబ్బయ్యగారికి బాగా పరిచితములు. ఆయనే శ్రీ సచ్చిదానంద మూర్తికి యోగాసనాలు నేర్పుతానని ప్రారంభించి దాదాపు 12 ఆసనాలు, ప్రాణాయామంలోని ప్రారంభ సోపానాలు అలవర్చారు. ఆయన రోజు ప్రయివేటు చెప్పటానికి తెల్లవారు 4½ గంటలకు వచ్చేవారు. అప్పటికే బాలుడైనా సచ్చిదానందమూర్తి లేచి స్నానాది కార్యాలు నెరవేర్చుకొని సిద్ధంగా ఉండేవారు. రామసుబ్బయ్యగారికి ఆంగ్ల వ్యాకరణం క్షుణ్ణంగా వచ్చు. సచ్చిదానందమూర్తికి ఆయన బోధలవల్ల అది బాగా వంటపట్టింది. క్లాసుపుస్తకాలు కాకుండా రామసుబ్బయ్యగారు ఈసప్స్ కథలు, గ్రిమ్స్ కథలు ఇత్యాదివి చదివించేవారు. నేడు శ్రీ సచ్చిదానంద మూర్తి ఆంగ్లభాషలో అసాధారణ నిపుణతతో రచన భాషణ సాగిస్తున్నారంటే చిన్ననాడు ఆ గురువు వేసిన ప్రాతిపదిక కొంతవరకు సహాకరించిందన్నమాట. ఈ కాలములోనే సచ్చిదానందమూర్తిగారి తండ్రికి

చిరకాలమునుంచి రామభక్తుడై ఉన్నా ఎందుకనో ఆంజనేయులు మీాద ఎక్కువ ప్రపత్తి ఏర్పడింది. కుమారునిచేత ప్రతి శనివారం హనుమదారాధన చేయించేవారు. ప్రతిశనివారం ఉదయం శ్రీ సచ్చిదానందమూర్తి షోడశోపచార పూజ హనుమంతునికి చేసేవారు. తీర్థయాత్రకు వెళ్ళినప్పుడు పూరీ జగన్నాథంలో సంపాదించిన నల్లరాతి ఆంజనేయ విగ్రహం ఈ ఆరాధనంతా అందుకునేది.

హిందీ విశారద పరీక్షలో పాఠ్యగ్రంథాలుగా ఉంచబడిన ప్రేమచంద్ మొదలగు వారి నవలలు, టాగూర్, దిలీప్‌కుమార్‌రాయ్ ఇత్యాదుల నాటకాలు మొదలైనవి శ్రీ సచ్చిదానందమూర్తికి అభ్యుదయవాదుల భావాలతోను, గాంధీ నెహ్రూల అభిప్రాయాలతోను పరిచయం చేసినవి. అస్పృశ్యతా నివారణాదులపై హిందీలోని అనేక వ్యాసాలు ఆ రోజుల్లో చదివారు.

13 వ ఏటనుంచి ఆయనకు గుంటూరులోని సుప్రసిద్ధ మహా పండితులు, కవులు అయిన పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులుగారు నిత్యం ఇంటికివచ్చి సంస్కృతం చెప్పేవారు. కావ్య నాటక అలంకారాలు చాల వరకు వారు చెప్పారు. ఆ రోజుల్లో గుంటూరులో భగవద్గీతా ప్రచారక సంఘం అంటూ ఒకటి ఉండేది. ప్రతిఏటు, ఉత్తమ మధ్యమ ప్రథమ పరీక్షలనేవి జరిపి ఉత్తమపరీక్షలో అగ్రగణ్యుడుగా ప్యాసయిన విద్యార్థికి 'గీతానిధి' అనే బిరుదును, ఒక బంగారు పతకాన్ని ఆ సంఘం ఇచ్చేది. ఉత్తమపరీక్షకు భగవద్గీత ఆచార్యత్రయములో ఏ ఒక్కరి యొక్కగాని, తిలకుయొక్కగాని భాష్యసహితంగా పఠనీయంగా ఉండేది. కొన్ని అధ్యాయాలు కంఠస్థంగా కూడ రావాలి.

పేతమైన భగవద్గీత ఉత్తమపరీక్షకు తయారు చేయుండని శ్రీ సచ్చిదానందమూర్తి తండ్రిగారు కోరగా, పూర్ణప్రజ్ఞాచార్యులుగారు తాను స్మార్తులు గాకున్నా ఉదారతతో అంగీకరించారు. ఆచార్యులుగారికి ఏ పనిచేసినా సగంగాచేయటం ఇష్టం లేదు. "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" దగ్గరనుంచి "ధ్రువానీతిర్మతిర్మమ" అనేవరకు సాంగంగా భగవద్గీతను, అక్షరశః శంకరభాష్యాన్ని ఆచార్యులువారు బోధించారు. తులనాత్మకంగా మధ్వ సిద్ధాంతాల్ని కూడ చెప్పేవారు. ఇంటిదగ్గర స్వయంగా తిలకువ్రాసిన గీతారహ

స్యాన్ని శ్రీ సచ్చిదానందమూర్తి చదువుకొనేవారు. తెలుగు ఎన్నడూ ఎవరూ చెప్పకుండటంచేత పరీక్షలో ఇతను వ్రాసే తెలుగు ఎలా ఉంటుందో అని ఆచార్యులవారికి ఎంతో అనుమానంగా ఉండేది. కాని శాంకర సిద్ధాంత సహితమగు గీతలో ఏ ప్రశ్న వేసినా సచ్చిదానందమూర్తి చెప్పగలడనే ఆచార్యులవారి ధైర్యం. ఎలాగయితేం పరీక్ష అయింది. సచ్చిదానంద మూర్తి అందులో దిగ్విజయంగా వచ్చి "గీతానిధి"అనే బిరుదాన్ని సువర్ణపతకాన్ని పొందారు. టౌను హైస్కూలులో ఒక పెద్దసభలో వెందుకూరి నరసింహశాస్త్రులు గారు మున్నగు మహాపండితుల సమక్షంలో శ్రీ సచ్చిదానంద మూర్తికి పతకము, బిరుదు ఇవ్వ బడినవి. నాటి కాయన వయస్సు 14 ఏండ్లు.

5 వ ఫారం చదివేప్పుడు శ్రీ సచ్చిదానందమూర్తి తన తండ్రి గారితోకలసి ప్రస్తుతం పార్లమెంటు మెంబరుగాను, ఆనాడు మదరాసులో బారిష్టరుగాను ఉండిన కొత్త రఘురామయ్యగారింట నెలపైన ఉన్నారు. రఘురామయ్యగారు శ్రీ సచ్చిదానందమూర్తి మేనత్త కూతుర్ని వివాహమాడినారు. ఇప్పటికి రఘురామయ్యగారికి జ్ఞాపకం ఉందో లేదో గాని ఆయన సచ్చిదానంద మూర్తికి పెద్ద ఉపకారం చేశాడు. సచ్చిదానందమూర్తిని ఐ.సి.యస్. కు పంపమని, దాని కిప్పటినుంచి సరైనపుస్తకాలవి చదివిస్తుండాలని చెప్పి, వారి తండ్రిచేత ఇంగ్లీషు సాహిత్యంలో కొన్ని ఉత్తమ గ్రంథాలు కొనిపించి ఇవి చదివించ మన్నారు. స్కాట్, విక్టర్ హ్యూగో, అలెగ్జాండర్ డుమా, గోల్డ్ స్మిత్ ఇత్యాదులు వ్రాసిన కొన్ని పుస్తకాలు అప్పటి కప్పుడే మూర్ మార్కెట్‌లో కొనిపించారు. స్వయంగా పాల్ గ్రేవ్స్ గోల్డెన్ ట్రెజరి బహూకరించారు. అది ఇప్పటికి శ్రీ సచ్చిదానందమూర్తి గ్రంథాల్లో ఉంది. సనాతన గ్రంథాలు చదివారు; హిందిలోని నవలలు, నాటకాలు చదివేరు; గాని అప్పటికి శ్రీ సచ్చిదానందమూర్తి పాశ్చాత్యసాహిత్యం చదవలేదు. ఆయన కథలంటే నవలలంటే చెవు కోసుకుంటారు. అప్పుడా పుస్తకాలురుచి మరగినాక ఇక ఆయన పాశ్చాత్య సాహిత్యాన్ని విడువలేదు. ఇంటర్మీడియేటు, ఆనర్సు చదువుతూన్నప్పుడు ఆయన చదివిన పాశ్చాత్య

సాహిత్యం అపారం. టర్జనెవ్, గోర్కీ, టాల్‌స్టాయి, డోస్టోవ్‌స్కీ, చెకోవ్ ఇత్యాది రష్యన్ రచయితలు; విక్టర్‌హ్యూగో, అలెగ్జాండర్‌డుమా, మోపాసా, అనటోల్ ఫ్రాంస్, బాల్జా, రోమేరోలా మొదలగు ఫ్రెంచి గ్రంథకారులు, యూరిపిడెస్, శాఫో, ఎయిస్క్యలిస్, హోమర్ మున్నగు గ్రీకుకవులు, డికెన్స్, తేకరి, ఇలియటు, హార్డి, స్కాటు, మొదలగు ఇంగ్లీషు నవలా రచయితలు శ్రీ సచ్చిదానంద మూర్తికి చిరపరిచితులు. ఆల్డస్ హాక్సలీ, సోమర్‌సెటుమోం, మార్సెల్‌ప్రూస్ట్, ఫ్రాన్సిస్‌మోరియాక్, ఆండ్రెజీద్, అప్టన్‌సింక్లెయిర్, పెరల్‌బక్ ఇత్యాది ఆ ఆధునికుల్నికూడా ఆయన వదలలేదు.

శ్రీ సచ్చిదానందమూర్తికి మొదటినుంచి గణితం అంటే అయిష్టం. సాహిత్యం, తత్త్వశాస్త్రం ఇవి ఆయనకు ప్రాణం. అయితేనేం మెట్రిక్యులేషన్ వరకు ఆయనకు గణితమే ఆప్షనల్ — ఇంటర్మీడియటులో సైన్సులు ఆప్షనల్. సైన్సు సరిగా చదువక క్లాసులో చెప్పేది వినక ఆయన ఇంటర్మీడియటులో తప్పారుకూడ. ఆయన తప్పుతున్నా అప్పుడు ప్రిన్సిపాల్‌గా ఉన్న బుద్ధిరాజు రామచంద్రరావుగారు ఆయనకు ఇంగ్లీషులోను, సంస్కృత, హిందీలలోను ఉన్న ప్రతిభను చూచి ఆయనొక "జీనియస్" అనే చెప్పేవారు. అలాగే వ్రాశాడుకూడా.

ఇంటర్మీడియేటు చదువుతున్నప్పుడే వేసవి శెలవల్లో ఆయన భగవద్గీతమీాద తెలుగులో వ్యాఖ్య వ్రాశారు. ప్రింటులో డెమ్మీ సైజున అది 800 పేజీల విశాలగ్రంథం అయింది. అర్థం, వివరణ, తాత్పర్యం, ఇంగ్లీషులో సారం, ఇంగ్లీషులో తులనాత్మకమైన కొటేషన్లు ఇన్నిటితో కూడిన గ్రంథంఅది. చివర మంత్రశాస్త్ర ప్రకారం భగవద్గీతకున్న విలువ, భగవద్గీతా పాఠవిధికూడా పొందుపరచబడ్డవి. వ్యాఖ్యానం అద్వైత సిద్ధాంతానుసారము నడచినా, కాశీ కృష్ణాచార్యులుగారి వంటి సుప్రసిద్ధ ద్వైతపండితులు దాన్ని మెచ్చుకొని హర్షించారు. అప్పుడు గుంటూరులో భగవద్గీతా ప్రచారకసంఘానికి అండగా ఉన్నట్టి, భగవద్గీతమీాద స్వయంగా ప్రశ్నోత్తరరూపంగా పుస్తకాలు వ్రాసినట్టి, అతి నిశిత విమర్శకులైనట్టి మైలవరపు వెంకట్రామయ్యగారు శ్రీ సచ్చిదానందమూర్తిగారి

వ్యాఖ్యానాన్ని చదివి, ఆయన ప్రతిభ (జీనియస్) అప్రతిమానం అన్నారు.

గుంటూరు హిందూ కాలేజి ప్రిన్సిపాల్‌గా వుండిన బుద్ధిరాజు రామచంద్రరావుగారు, ఈ వ్యాఖ్యాన సహితమగు గీతే తమ నిత్యపారాయణ గ్రంథమని, తన కాపీ ఎవరో తీసుకవెళ్లారని, మరొకటి పంపమని ఈ మధ్య వ్రాసినారు. రిటైర్డు డిప్యూటీ కలెక్టరు అగు రెడ్లం వెంకటకృష్ణారావుగారు, తమ మేనగోడలు ఇంగ్లాండునుండి ఒక భగవద్గీతా ప్రతిని పంపమని కోరగా 'ంతే మంచిది దొరకక యిదే పంపితిమని చెప్పారు. రాజ్‌పుటానా యూనివర్సిటీలో తత్త్వ శాస్త్రాచార్యులుగా నున్నట్టి, అమెరికాలోని ఇల్లినాయిస్ యూనివర్సిటీలో ఆచార్యులుగా పనిచేసినట్టి శ్రీ పి.టి. రాజుగారు యింతకంటె మంచి వ్యాఖ్యానము తెలుగులో లేదని తనకు చెప్పారని, కాన ఒక కాపీ పంపమని నర్సీపట్నంనుండి ఒకరు కార్డు వ్రాశారు. ఈ వ్యాఖ్యానాన్ని యింత చిన్నతనంలో వ్రాయటం చూచి, నాడు కృష్ణాపత్రిక సంపాదకులుగా వున్న ముట్నూరి కృష్ణారావుపంతులుగారు శ్రీ సచ్చిదానంద మూర్తిని 'ప్రహ్లాదుని అపరావతారి' మని కృష్ణాపత్రికలో వ్రాశారు.

ఇంటర్మీడియట్ అయినాక శ్రీ సచ్చిదానందమూర్తిగారు మధ్య భారతదేశములో ముఖ్యంగా ఇందూరులో చాలరోజులుండి గీతపై నడుపన్యాసాలిచ్చారు. తిరిగివస్తూ సేవాగ్రాంలో గాంధిగారి ఆశ్రమం చూచివచ్చారు. తర్వాత ఆంధ్రలో కూడా గుంటూరుజిల్లాలో కొన్నిచోట్ల గీతపై మాట్లాడారు. తర్వాత కొంతకాలమునకు వారి వివాహము జరుగగా అందులో ఆశీర్వదించుచు వారి గురువు శ్రీ పూర్ణప్రజ్ఞాచార్యులుగారు "నీకు పెళ్లెందుకు, యిదివరకే ప్రియురాలు ఉందిగా" అని ధ్వని వచ్చేట్లు సుందరంగా "గీత నీ ప్రేయసికదా" అని సంస్కృతంలో ఇలాఅన్నారు:— "గీతా సా దయితేవ భాతి నితరాం భో సచ్చిదానంద తే".

ఇంటర్మీడియట్ అయినాక శ్రీ సచ్చిదానందమూర్తి ఆయన తండ్రి బి. ఏ. లో చేరాలని ఉద్దేశ్యపడుచుండగా, మళ్ళీ ఒకసారి రఘురామయ్యగారే ఆయన జీవితానికి నూతన డైరెక్షనుయిచ్చారు. "బి. ఏ. చదవటమెందుకు, తిన్నగా ఆనర్సు చదివితేనే మంచిది, ముఖ్యంగా

హిస్టరీ ఆనర్సు ఉత్తమం' అనిచెప్పి ఆయన శ్రీ సచ్చిదానందమూర్తిని ఆంధ్రయూనివర్సిటీ రిజిస్ట్రారు దగ్గరకు, హిస్టరీశాఖలో ప్రొఫెసరుగా వున్న శ్రీనివాసన్ దగ్గరకు తీసుకపోయి పరిచయం చేశారు. కాని ఆయనతండ్రి నీవు ఆనర్సులో తత్త్వశాస్త్రము తీసుకుంటే మంచిది. అదయితే నీకు సునాయాసముగా వస్తుంది, అనిచెప్పారు. దైవవశాత్తు ఇంటర్మీడియటులో హిస్టరీ తీసుకోని వాళ్ళకు ఆనర్సులో హిస్టరీకు సీటు యివ్వము అని అనటాన, శ్రీ సచ్చిదానందమూర్తి తత్త్వశాస్త్రాన్నే ఆనర్సులో తీసుకొన్నారు.

ఇంటర్మీడియెట్ ప్యాసయిన కొన్నాళ్ళకే ఆయన షడ్దర్శనాల్ని కాశీ చౌఖంబా బుక్ డిపోనుంచి తెప్పించారు. వాటినన్నింటిని మూలంలోనే సభాష్యంగాచదివేరు. క్లాసులో వినేదిగాక, ప్లేటో, అరిస్టోటిల్, క్యాంటు హెగల్ పె Monographs అన్నిచదివారు. ఆ రోజుల్లోనే హిగిన్ బాదమ్స్ రైల్వే స్టాలులో అనిల్ వరణరాయ్ అరవిందయోగిపై వ్రాసినపుస్తకము చదివి, 1944 వేసవిశెలవల్లో ఆయన ఆశ్రమాన్ని, మాతను చూచివచ్చారు. అరవింద ఆయనను ఆశీర్వదించారు. ఆనర్సు చదివేప్పుడు ఒక వేసవిలో ఆయన అనుదినం 40 రోజులు ఇంట్లోనే పురుషసూక్తం ప్రకారం శివలింగానికి అభిషేకంచేసి షోడశోపచారపూజ, ధూప దీప నైవేద్యాలు సమర్పించి మృత్యుంజయ పంచాక్షర మంత్రం జపం చేశారు. చిన్ననాడు కాశీ వెళ్ళినప్పుడు తీసుకొచ్చిన కృష్ణశిలా లింగమును ఈవిధంగాఆరాధించారు. అప్పుడే ఈశోపనిషత్తుమీద తెలుగులో భాష్యంకూడ వ్రాశారు.

1946 లో యూనివర్సిటిఫస్టుగా ఆనర్సు ప్యాసయి, రెండునెలలలోనే తిరుపతికాలేజీలో ఉపన్యాసకులుగా నియమితులైనారు. అక్కడుండగా వారు సాయంకాలమునందు హిందు మతంపై యిచ్చిన ఉపన్యాసములు ప్రచురింపబడ్డవి. తిరుపతి దేవస్థాన కమిటీవారి కోరికపై ఈ ఉపన్యాసాలిచ్చారు. తిరుపతిలోవుండగా వారికి అప్పటి మహంతు ప్రయాగదాసు గారితో చాలా మైత్రి వుండేది.

ఒకపడు అక్కడపనిచేసి స్వగ్రామంవచ్చి కొన్నాళ్లున్నారు. అప్పుడే I. A. S. పరీక్షకు వెళ్లాలని దరఖాస్తు ఫారాలవి తెప్పించి పూర్తిచేసి దాని మీద కలెక్టరు సంతకముకావాల్సి, గుంటూరువెళ్ళి ప్రొద్దుననుంచి

సాయంకాలముదాక వరండాలో వున్నాగా నిదర్శనం ఇవ్వక, అప్పుడు మళ్ళీ తర్వాత రమ్మని కలెక్టరు అనటాన, ఈ పరీక్షకు చస్తే వెళ్ళను అని పంతంపట్టి వెళ్ళక మానుకొన్నారు. అప్పటి కలెక్టరు ఒక తురకవాడు. అప్పుడు పరీక్షకు పిచ్చి పంతంపెట్టి పోకపోతినే అని ఆయన తర్వాత అప్పుడప్పుడు విచారించక మానలేదు. అయితే పరీక్ష ప్యాస యినా, కళ్ళ అద్దాల పవరు హెచ్చు గావటాన యెలాగు తీసుకునేవారు కారేమో అని ఆయన సమాధానం చెప్పుకుని విరమించుకున్నారు.

తర్వాత కొన్ని రోజులకే మయూర్ భంజ్ అనే స్వదేశసంస్థానంలోని కాలేజిలో మంచిజీతంమీద ఆయనను లెక్చరరుగా వేయగా అంగీకరించి వెళ్లారు. కాని యింత దూరదేశంలో ఈపాటి జీతానికి పడి వుండవలెనా అనే ఒకవిధమైనజుగుప్స కలిగింది. కాక ఆయన ఉంటూ ఉన్న ఇంటికి సరిగ్గా ముందరే ఒక మిఠాయి దుకాణంవాడుండేవాడు. వాడొకనాడాయనకు తాను రోజుకు 15 రుప్య. సంపాదిస్తున్నాననిచెప్పాడు. దాంతో ఆయనకు తన జీవితంమీాది గౌరవం బొత్తిగా పోయింది. నా స్వంత పొలాలు చూచుకుంటూ వుండినా నాకీజీతం గిట్టుతుందే, అవి యితరులకిచ్చి ఇక్కడ పడివుండటం ఎందుకు. పోతన, టాల్‌స్టాయిల లాగా హాలిక జీవితం గడుపుదామని ఆయన ఆ ఉద్యోగానికి రాజీనామా యిచ్చేసి స్వగ్రామం వెళ్లారు.

తిరుపతి నుంచి తిరిగి వచ్చి మయూర్ భంజ్ పోకముందు వారు స్వగ్రామంలో వున్నప్పుడు శ్రీ సచ్చిదానందమూర్తికి గుంటూరు బిషప్‌గారితో గాఢస్నేహం యేర్పడింది. క్రైస్తవమతాని గూర్చిన్ని, యాన్‌సెలం, బొనవెంటురా, ఎక్వినాస్ మొదలగు యూరోపీయ మధ్యకాలీనదార్శనికుల గ్రంధాలు ఆయన యెక్కువగా అధ్యయనంచేయుట మొదలిడినారు. ఇండియాలో హిందువులలో యింత గహనంగా క్రైస్తవ మతం లోతుల్లోకి పోయి చూచినవారు మరెవరూ లేరని, ఆక్స్‌ఫర్డులో కేంపియన్ హాల్‌కు మేష్టరుగానుండిన డార్సీ, ఐక్యరాజ్య సాంస్కృతిక సభాధ్యక్షుడుగాను, ఇటలీలో ఫ్రెంచి రాయబారిగాను వున్న మేరిటయిన్ అన్నారు.

"Thought and the Divine" అను వీరు వ్రాసిన గ్రంథం చాలా ప్రసిద్ధి నొందింది.

కొన్ని నెలలకే ఆంధ్ర యూనివర్సిటీలో తత్త్వశాస్త్రాధ్యాపకులుగావున్న పి. టి. రాజుగారు అమెరికాకు ప్రొఫెసరుగా వెళ్ళగా, కట్టమంచి రామలింగారెడ్డిగారు అయాచితంగా శ్రీ సచ్చిదానందమూర్తిని ఆ స్థానంలో నియమించి ఉత్తరం పంపారు. తన ప్రాత గురువైన శైలేశ్వరసేన్ నిర్బంధంమీాద, తండ్రి కోరికపైన, శ్రీ సచ్చిదానందమూర్తి ఈ వుద్యోగాన్ని స్వీకరించారు. సి. ఆర్. రెడ్డిగారు మొదట విద్యార్థిగా నున్నప్పుడు శ్రీ సచ్చిదానందమూర్తి మాట్లాడుతుండగా చూచారు. తర్వాత ఆయన వ్రాసిన భగవద్గీతాదులు చదివారు. వాల్తేరులోను, చిత్తూరులో స్వగృహంలోను ఆయన కాతిథ్యం యిచ్చి సంభాషణాదులు చేశారు. సి. ఆర్. రెడ్డిగారు బ్రహ్మనుగూడ ఆలోచించకుండా మెచ్చేవారు కారు. కాని ఎక్కడైన ప్రతిభవుందని తోచిందా మెంతైనా ప్రశంసించేవారు, ప్రోత్సహించేవారు. సచ్చిదానందమూర్తి ఆయనదృష్టిలో "Dynamic and creative Personality" "boy Prodigy" 'సర్వోత్తమ ఆదర్శాలకై ప్రయత్నించే జీవి' ఈమాటలు ఆయననోటితో చాలాసార్లు అనటం గాకుండా, వ్రాతలో కూడా యిచ్చారు.

1949 లో ఆంధ్ర యూనివర్సిటీలో ఉపన్యాసకులుగా చేరి 1954 లో తత్త్వశాస్త్రశాఖ కధ్యక్షులుగా అయినారు శ్రీసచ్చిదానందమూర్తి. ఈ ఆరేండ్లలో ఆయన చేసిన కృషి అపారం. ప్లేటో వ్రాసిన గ్రంథాలు మూలంలో ఈవరకే చదివారు. ఈ 5 ఏండ్లలో అరిస్టాటిల్ అగస్టయిన్, ఎక్వినాస్, డెకార్టు, స్పినోజా, లైబ్నిజ్, బర్క్లే, లాన్, హ్యూమ్, క్యాంట్, హెగెల్‌ల గ్రంథాలు మూలంలో చదివారు. ఆధునిక తత్త్వశాస్త్రజ్ఞులగు రస్సెల్, క్రోచ్, వైట్‌హెడ్, డెవీల గ్రంథాలు చదివారు. పాశ్చాత్యతత్త్వశాస్త్రంతో ఇంత పరిచయం వున్నవాడు భారతదేశంలో వున్నందుకు ఆశ్చర్యపడుతున్నాం అని స్కాట్లండులోని సెంటు యాండ్రూజ్ విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు, ఆక్స్‌ఫర్డులోని నోల్లత్ ప్రొఫెసరు, మనదేశ ప్రసిద్ధ తత్త్వవేత్త దాస్ గుప్తా సహితం అన్నారు.

యూనివర్సిటీలో చేరినాక ఆయన తెలుగులో "రామానుజ దర్శనం" అనే గ్రంథం వ్రాశారు. ఇంత సంగ్రహంగాను నిస్సంశయం

గాను విశిష్టాద్వైత సిద్ధాంతాలు తెల్పే గ్రంథం తెలుగులో లేదని విశిష్టాద్వైత ప్రచార మహా సభవారు ప్రకటించే పత్రికవ్రాసినది. శ్రీ కేశవతీర్థస్వామి దీన్ని ప్రకటించారు.

మన తత్త్వశాస్త్రం, సంఘ శాస్త్రం, మానవ విజ్ఞానశాస్త్రం చదవటంచేత గత నాల్గేండ్లలో శ్రీ సచ్చిదానంద మూర్తి అభిప్రాయాలు చాలా మారినవి. కేవల విమర్శనాత్మక దృష్టితో ఆయన భారతీయ తత్త్వశాస్త్రంపై వ్రాసిన గ్రంథాన్ని చూచి, యం. యన్. రాయ్, రాహుల సాంకృత్యాయనులు 'బాగు బాగు' అన్నారు. అనేకులు ఆయన నాస్తికుడు, భౌతికవాది అయ్యాడేమో అని అనుకున్నారు.

గత రెండేండ్లలో ఆయన అద్వైత వేదాంతాన్ని మథించారు. శాంకర భాష్య ప్రపంచాన్నేగాక, వాచస్పతి అమలానంద అప్పయ్య దీక్షితుల యొక్క, పద్మపాద ప్రకాశాత్మ విద్యారణ్యులయొక్క భామతీ వివరణ ప్రస్థానాలను మూలంలోనే ఆస్వాదించి, మధుసూదనుని అద్వైత సిద్ధి, శ్రీహర్షుని ఖండన ఖండఖాద్యములతో తృప్తి పడ్డారు. అలాగే దర్శనాలను ముఖ్యభాష్యాలతో ఈవరకే చూచినప్పటికి సిపులంగా ఈవరకు చదువలేదు. ఈ మధ్య న్యాయంలో ఉద్యోతకర, వాచస్పతుల టీకలు, ఉదయనుని కుసుమాంజలి పూర్తిచేశారు. అలాగే పూర్వ మీమాంసా పారదర్శి అయిన కుమారిలభట్టు వ్రాసిన శ్లోకవార్తిక తంత్రవార్తికాలను అక్కడక్కడచూచి అవగతం చేసుకున్నారు. ప్రభాకరుని బృహతి వాసనచూచి, శాలికానాథుని ప్రకరణపంచిక అధ్యయనంచేసి తృప్తులైనారు. అయోధ్య సంస్కృత సమాజంవారు "సాహిత్యరత్న" అనేబిరుదు కొంతకాలంక్రిందట వీరికి యిచ్చారు. ఆ సమాజానికి గోవర్ధన పీఠ శంకరులు అధ్యక్షులు. అచిర కాలంలోనే ఆంగ్లంలో వీరు శాంకర వేదాంతంపై వ్రాసిన గ్రంథం బహిర్గతం కాగలదు.

వీరి భగవద్గీతావ్యాఖ్య ఇప్పుడు లబ్ధం కావటంలేదు. పునర్ముద్రణాలోచనలు జరుగుచున్నవి.

పోయిన కుంభమేళా సందర్భములో ప్రయాగలో జరిగిన అంతర్జాతీయ ఆధ్యాత్మిక పార్లమెంటులో శ్రీ సచ్చిదానందమూర్తి యిచ్చిన వుపన్యాసం, పార్ల

మెంటు అధ్యక్షుడైన హైకోర్టు జడ్జి అగర్వాలా మున్నగువారు ఎంతో ప్రశంసించారు. ఉపన్యాసం గోవర్ధన పీఠాధీశ్వరులైన శంకరాచార్యుల సమక్షమున జరిగింది.

1954 డిశెంబరులో, సిలోన్‌లో ఐక్యరాజ్య సాంస్కృతిక సమితి (Unesco), అఖిలభారతీయ తత్త్వశాస్త్రపరిషత్తుల అధ్వర్యాన జరిగిన 'Man & his neighbour' అను విషయంపై గల చర్చలో వీరు పాల్గొనటానికి ఆహ్వానించబడి, యూరప్‌లో వుండటాన వెళ్ళలేక, వుపన్యాసం వ్రాసిపంపారు.

అక్టోబరు 1954 లో వీరు యూరోప్ పర్యటనార్థంవెళ్లారు. వీరి పర్యటనకూడ విలక్షణం. మామూలుగా మనదేశంనుంచి పడమటి దేశాలకు వెళ్లేవారురెండురకాలు. ఆదేశాల్లో వేదాంతం అన్నా, హిందూమతం అన్నా యిష్టమైన ఏ పదిమందినో పది ఇరవై పట్టణాల్లో కలసి వారికి వేదాంతాన్నిగూర్చి, యోగాన్ని గూర్చి యేవో ఉపన్యాసాలుకొట్టి వచ్చి, బ్రతికినంతకాలం "బ్రతికినంత కాలం మేము విదేశాల్లో వేదాంత ప్రచారం చేసివచ్చాం" అని చెప్పుకునేవారు ఒకరకం. కేవలం ఆ దేశాలకువెళ్ళి ఏ ఒక విశ్వవిద్యాలయంలోనో కొన్నాళ్లుండి ఏదో చదివో పరిశోధన జరిపో డిగ్రీ తీసుకునో, తీసుకోకుండానో వచ్చేవారు మరొక రకం. శ్రీ సచ్చిదానందమూర్తి యాత్ర రెండు రకాలకు చెందదు. వారు యూరోప్‌లోని ప్రసిద్ధ చింతకులగు సి. జి. యూంగ్, బెర్ట్రాండ్ రస్సెల్, కేరల్‌జాస్పర్స్, గిల్బర్టురైల్, ఆర్నాల్డ్‌టాయిన్బీ, ఇత్యాదులను కలసి చర్చలు జరిపారు. కేంబ్రిడ్జిలో ఆరువారాలు పరిశోధనలో కాలం గడిపారు. ఇటలీ, స్విట్జర్లాండు, జర్మనీ, ఫ్రాంసు, ఇంగ్లండు, గ్రీసు, ఈజిప్ట్‌ల లోని సంస్కృతిని, మతాన్ని, విద్యావిధానాన్ని తత్త్వశాస్త్రి పురోగమనాన్ని అధ్యయనంచేసి ఈ మధ్యే తిరిగి వచ్చారు.

ఒక నూతన దర్శనాన్ని వెలుదీయటానికి వారు ప్రయత్నిస్తున్నారు. ఒక 8 లేక 10 ఏండ్లలో అది సొంతము కావచ్చును.

. కె. వేదవతీదేవి.



శ్రీ కృష్ణాయ నమః.

# కౌరవసైన్యములోని మహావీరుల సంగ్రహ చరిత్ర.

రచయిత: వంగీపురం రంగస్వామి అయ్యంగారు,

పాకాల, చిత్తూరు జిల్లా.



పాండవసైన్యములోని ప్రధానవీరులను పేర్కొని దుర్యోధనుఁడు ద్రోణాచార్యులతో తన సైన్యములోని వీరోత్తములను గుర్తింపఁగోరి యిట్లనెను. బ్రాహ్మణోత్తమా! మీరు, భీష్మాచార్యులు, కర్ణుఁడు, జయశీలుఁడగు కృపాచార్యులు, అశ్వత్థామ, వికర్ణుఁడు, సోమదత్తుని పుత్రుఁడగు భూరిశ్రవుఁడును వీరేగాక శస్త్రాస్త్రకోవిదు లనేకశూరులు యుద్ధమున నా నిమిత్తము ప్రాణము లర్పింప సిద్ధముగనున్నారు.

1. **ద్రోణాచార్యుఁడు:—** ఇతఁడు భరద్వాజమహర్షి పుత్రుఁడు. వేద వేదాంగ విశారదుఁడు. ఇతఁడగ్నివేశ్యుఁడను ఋషివద్దను, పరశురామునివద్దను సకలాస్త్ర శస్త్ర ప్రయోగోపసంహారముల నేర్చెను. అతఁడు మహర్షి శరద్వాసుని కూతురగు కృపిని వివాహమాడి అశ్వత్థామ యను పుత్రునిఁ బడసెను. ద్రోణుఁ డొకపరి బాల్య స్నేహితుఁడని తలఁచి ద్రుపదునికడ కరిగి యతనిచే నవమానితుఁడై చింతతో మరలి వచ్చెను. ఈ యవమాన మతని హృదయమున నాటుకొనెను. అతఁడు హస్తినాపురమునకు వచ్చి బావమఱఁది యగు కృపాచార్యులతో నుండగా భీష్ముఁడతనిని పాండవ కౌరవులకు గురువుగా నియమించెను. వారికి విద్యాపూర్తి కాగా ద్రోణుఁడు గురుదక్షిణగా ద్రుపదుని చంపక పట్టి తెచ్చునట్లాజ్ఞాపింప నర్జునుఁడట్లు గావించె. ద్రోణుఁడు ద్రుపదుని రాజ్యములో గొంత స్వీకరించి యతని విడిచిపుచ్చెను. భారతయుద్ధమున ద్రోణుఁడు కౌరవ సేనానియై ఐదు రోజులు ఘోరయుద్ధముచేసి తన కుమారుఁడు మరణించెనను బొంకు మాట వినినంతనె శరవిసర్జనముచేసి యోగాభ్యాసముచే భగవంతుని ధ్యానించుచుండెను. అట్టియెడ నతని యాత్మ భౌతికశరీరమువీడి యాకసమంతయు జ్యోతిమయము గావించు సమయమున ధృష్టద్యుమ్నుఁడతని శిరము ఖండించెను.

2. **భీష్ముఁడు:—** ఇతఁడు శంతన మహారాజుయొక్క జ్యేష్ఠ పుత్రుఁడు, గంగాదేవికి జన్మించినవాఁడు. అతని తొలి నామధేయము దేవవ్రతుఁడు. తన తండ్రి సత్యవతిని పెండ్లాడగోరఁగా నామె తండ్రిని నమ్మించు నిమిత్తము బ్రహ్మచర్యము పూనునట్లు శపథము చేసినందున భీష్ముఁడని పిలువంబడియె. అట్టి పితృభక్తికి మహాత్యాగమున కుప్పొంగి యతని తండ్రి స్వచ్ఛంద మరణ మాసనికి ప్రసాదించెను. ఆమరణాంత బ్రహ్మచారియు సకల వేదవేదాంగ ధనుర్వేద పారంగతుఁడగు భీష్ముఁడు మూర్తీభవించిన ధర్మమే. అతఁడు సద్గుణనిధి, దైవభక్తుఁడు, శ్రీకృష్ణుని మాహాత్మ్యము చక్కఁగ నెఱింగినవాఁడు. భారతయుద్ధమున భీష్మునకు సాటిలేరు. పాండవుల వధింపనని ప్రతినపట్టినను రోజుకు పదివేవుర యుద్ధమునఁ బరిమార్తునని దుర్యోధనునకు వాక్రుచ్చి నెఱవేర్చిన లోకోత్తముఁడు. పది దినములు భారత యుద్ధమునఁ బరాక్రమముచే లోకమును మెప్పించి

శరతల్పమున యోగబలముచే శయనించి సర్వులకు సకల ధర్మోపదేశములు గావించి యుత్తరాయణమురాగా స్వసంకల్పముతోఁ బ్రాణము వదలెను.

3. **కర్ణుఁడు:-** ఇతఁడు కన్యగనుండగనే కుంతీదేవికి సూర్యుని యనుగ్రహముచే జనించినవాఁడు. లోకాపవాదభీతిచే నద్దేవి యా శిశువు నొక్క పెట్టెయందుంచి నదియందు విడిచెను దైవానుగ్రహమున నా పెట్టె హస్తినాపురమున అతిరథుఁడను సూతునకు లభ్యమయ్యెను. అతఁడానందముతో నా శిశువు నింటికి గొంపోయి భార్య యగు రాధచేతికియ్యగా నామెయు నా బిడ్డను గన్న కుమారుఁడనియె భావించి పెంచెను. కర్ణునకు పుట్టుకతోడనే బంగారు కవచకుండలము లుండినందున వసుషేణుఁడని పిలువంబడుచుండెను. కర్ణుఁడు ద్రోణాచార్యులవద్దను, పరశురామునివద్దను విలువిద్య నేర్చి ప్రవీణుఁడయ్యెను. దుర్యోధనుఁ డతని మహిమం గనుగొని యతని నంగదేశమునకు రాజుగ నియమించెను. కర్ణ దుర్యోధనులకత్యంత స్నేహమేర్పడినందున తల్లియగు కుంతీదేవి చెప్పినను శ్రీకృష్ణుఁడే చెప్పినను దుర్యోధనుని విడిచి పాండవ పక్షముచేర నిరాకరించెను. అతఁడు నిరంతరము సూర్యునారాధించుచు నెవరేమి యడిగినను లేదనక యిచ్చుచు దానవీరుఁడని ఖ్యాతి గాంచెను. అర్జునుని హితముగోరి యింద్రుఁడొకనాఁడు విప్రవేషమున కర్ణునొద్దకేగి యతని కవచ కుండలముల నర్థింపఁ గర్ణుఁడాక్షణమె జంకక వాని నిచ్చెను. అందుకు మెచ్చి యింద్రుఁ డతనికొక శస్త్రము నిచ్చెను. దానిచే నతఁడు యుద్ధమున భీమసేనుని కుమారుఁడగు ఘటోత్కచునిం బరిమార్చెను. ద్రోణాచార్యుల మరణానంతరము కర్ణుఁడు కౌరవ సర్వసేనానియై రెండు దినములు ఘోర యుద్ధముచేసి తుద కర్జునునిచేఁ జచ్చెను.

4. **కృపాచార్యుఁడు:-** ఇతఁడు గౌతమ ఋషి వంశస్థుఁడగు శరద్వాన మహర్షి యొక్క కుమారుఁడు. ఇతని విలువిద్యా ప్రావీణ్యము సుప్రసిద్ధము. ఇతని సోదరి కృపి. శంతన మహారాజుయొక్క కృపచేఁ బెంచబడినవారగుటచే నితఁడు కృపుఁడనియు నితని సోదరి కృపియనియుఁ బిలువంబడిరి. కృపాచార్యుల పాండిత్యము, పటిమ, ప్రజ్ఞ, ధర్మనిరత యసదృశము. ద్రోణాచార్యులు వచ్చుటకు ముందు కృపాచార్యులే పాండవ కౌరవ యాదవులకు విలువిద్య నేర్పుచుండెను. ఇతఁడే పరీక్షితునకును ధనుర్విద్య నేర్పినవాఁడు. ఇతఁడు మహాశూరుఁడగుటచే సమితింజయుఁడు (యుద్ధమున జయము పొందువాఁడు) అని బిరుదము పొందెను. ఇతఁడు చిరంజీవి.

5. **అశ్వత్థామ:-** ఇతఁడు ద్రోణాచార్యుల పుత్రుఁడు. ఇతని ధనుర్విద్యాకౌశలము, శౌర్య ధైర్యము లితనికి 'మహారథి' యను బిరుదము తెచ్చినవి. ఇతఁడు తండ్రి వద్ద విద్య నేర్చినవాఁడు. ఇతఁడును చిరంజీవియె.

6. **వికర్ణుఁడు:-** ఇతఁడు ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొకఁడు. ఇతఁడు సత్యసంధుఁడు, ధర్మనిష్ఠుఁడు. ఇతఁడును మహారథుఁడే. కౌరవసభలో ద్రౌపది తన్ను పాండవులు జూదమున పణముగ నోడిరాయని సభికులఁ బ్రశ్నింప విదురుఁడొక్కరుఁడు దప్ప దక్కినవా రూరకుండగా వికర్ణుఁడు లేచి ధైర్యముగ గంభీరవాక్కుతో

ద్రౌపదిని పాండవులు జూదమునం బోగొట్టుకొనిరనుట యత్యంత యక్రమము, అన్యాయమని యుద్ఘాటించెను.

7. భూరిశ్రవుఁడు:. ఇతఁడు శంతనుని జ్యేష్ఠభ్రాతయగు బాహ్లికుని మనుమఁడు, సోమదత్తుని కుమారుఁడు. ఇతఁడును సద్గుణ సంపన్నుఁడు, మహాశూరుఁడు, మహారథి. ఇతఁడనేక దానములతో ననేకయజ్ఞములుచేసి భారత యుద్ధమున సాత్యకిచే నిహతుడయ్యెను. కృపాశ్వత్థామలవలె వికర్ణ భూరిశ్రవులును జయమునే పొందెడివారు.

దుర్యోధనునకు యుద్ధమునకు పూర్వము వీరియందరియెడ గొప్ప యభిప్రాయ ముండినది కాని యుద్ధసమయమున వారియందు విరుద్ధాభిప్రాయము గలిగినది. దీనిని మరల వివరింతుము. [సశేషము.]

— వి. రంగస్వామి అయ్యంగార్.

# వార్తలు.

అగరము శ్రీ సనాతన వేదాంత జ్ఞాన సభా కార్యక్రమమును నిర్వర్తించుకొని శ్రీ శంకరానందస్వామివారును, శ్రీ రామకృష్ణానందస్వామివారును 10–3–55 తేదికి కోలారు చేరినారు. అచ్చటి ఆర్యవైశ్య గీతాసమాజమునందు శ్రీ శంకరానంద స్వామివారు ఒక్కపూట, శ్రీ రామకృష్ణ స్వామివారు మూడుపూటలు ఉపన్యసించినారు.

మార్చి నెల 12, 13, 14 తేదీలు శ్రీ శంకరానందస్వామివారు మైసూరుస్టేటు శివమొగ్గజిల్లా నేరేలకెరె గ్రామమునందు గీతోపన్యాసములు జరిపినారు.

కృష్ణాజిల్లా పెనమలూరు పరమాత్మానందాశ్రమమునందు మార్చి 16, 17, 18 తేదీలు గీతోపన్యాస కార్యక్రమము జరిగినది. శ్రీవారు కర్మయోగమునుగూర్చి ఉపన్యసించినారు. శ్రీరామకృష్ణగారు అనువదించినారు.

ఏప్రెల్ 1–వ తేదీనుండి 10–వ తేదీ వరకు చిత్తూరుజిల్లా పాకల చిన్మయా మిషన్ వారి ద్వారా శ్రీమద్భగవద్గీతా జ్ఞానయజ్ఞము నిర్వహింపబడినది. శ్రీయస్. యన్. దవే B. A. రిటైర్డు యిన్కంటాక్సు ఆఫీసరు గారిచే ఈ సమావేశ ప్రారంభోత్సవము జరుపబడినది. ప్రాతఃకాలము ఈశావాస్యోపనిషత్తును గురించియు, సాయంకాలము భగవద్గీతను గురించియు శ్రీ శ్రీ శ్రీ శంకరానందస్వాములవారు ఉపన్యసించినారు.

ఆళ్ళగడ్డ శ్రీ శంకరానందాశ్రమములో శ్రీ శంకరజయంతీ సప్తాహము జరిగినమీదట శ్రీ శంకరానంద రామకృష్ణులు పశ్చిమ గోదావరిజిల్లా వెళ్లెదరు.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదుర్తి, - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, - 4. స్వర్గీయ సేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, - 7. శ్రీ తొమ్మండ్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, ఎం. కృష్ణాపురము. - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. స్వర్గీయ శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల.- 12. శ్రీబొల్లుపల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల,

కడపజిల్లా: 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్.ఎస్. - 15. శ్రీపోతేపల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

అనంతపురం జిల్లా; 16. పూజ్యపాద శ్రీ చిదగనానంద మహారులవారు, శ్రీ భవనాశి ఆశ్రమం. - 17. శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. - 18. శ్రీ పి. నరసింహశాస్త్రిగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 19. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, చిత్తూరు. - 20. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, చిత్తూరు.

నెల్లూరుజిల్లా: 21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, నెల్లూరు. - 22. శ్రీ వేమారెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము పెరవలిపోస్టు, (తెనాలి)

కృష్ణాజిల్లా: 24. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. - 25. శ్రీ భట్టిప్రోలు సత్యనారాయణరావుగారు, సర్కిల్ పేట, బందరు. - 26 స్వర్గీయ బావినేని నవరత్నం స్మారకముగ తల్లిదండ్రులు బావినేని రామకోటయ్యచౌదరి - రాజేశ్వరమ్మగారు, శ్రీ పరమాత్మానందాశ్రమము, శ్రీగీతాభవనము, పెనమలూరు.

తూర్పుగోదావరి జిల్లా: 27. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి. - 28. శ్రీ సమయమంతుల ప్రకాశంగారు - సుబ్బమ్మగారి స్మారకముగ కుమారుడు శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి - 29. స్వర్గీయ సమయమంతుల మాణిక్యమ్మ కుమారుడు రామకృష్ణగారి స్మారకముగ తండ్రి శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి. - 30. శ్రీపూతంశెట్టి వెంకటరత్నం - శేషమ్మగార్ల స్మరణార్థం కుమారుడు జగ్గారావుగారు ర్యాలి. - 31. శ్రీ సమయమంతుల సత్యనారాయణ - వెంకటసుబ్బమ్మగార్ల స్మారకముగ శ్రీ నాగేశ్వరరావుగారు, రాధాకృష్ణరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా: 32. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులుగారు, పాలకొల్లు. – 33. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ – భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

నైజాం స్టేట్: 34. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. – 35. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ – 36. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం, కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

మైసూరు స్టేట్: 37. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పెట్ – 38. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పేట – 39. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెర. – 40. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, – 41. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్సు, బెంగుళూరు సిటీ.

మద్రాస్ రాష్ట్రం: 42. శ్రీ ఆర్. పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానల్లూరు, – 43. శ్రీగ్రంథే నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీధి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యప్పరాజుగారు, గోసపాడు. – 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. – 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. – 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. – 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. – 7. డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. – 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె. – 9. శ్రీN. రామిరెడ్డిగారు, డబ్ల్యు. కొత్తపల్లె. – 10. శ్రీ మదల్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. – 11. శ్రీజూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు, చాగలమర్రి. – 12. శ్రీమతి ఆర్. సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. – 13. శ్రీ పాణ్యం రామచంద్రయ్యగారు, నంద్యాల. – 14. శ్రీ పాణ్యం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల. – 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, పాణ్యం. – 16. శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరు – 17. శ్రీ జి. సి. బాలన్నగారు, ఆళ్లగడ్డ. – 18. శ్రీ యం. చిన్నఈశ్వరరెడ్డిగారు, ఐలూరు. 19. శ్రీ కృష్ణం గురవయ్యశ్రేష్ఠిగారు, మర్చంట్, చాగలమర్రి. – 20. ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మగారి స్మరణార్థం భర్త మాఖం సుబ్రమణ్యంగారు, నంద్యాల.

కడప జిల్లా: 21. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు. – 22. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దుటూరు. – 23. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. – 24. శ్రీ పెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు

వేంపల్లి. — 25. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్యశ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 26. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు.

అనంతపురం జిల్లా: 27. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 28 శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 29. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 30. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 31. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యాచౌదరిగారు, కుందనగుర్తి, — 32. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 33. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 35. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. — 36. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 39. శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 40. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. — 41. శ్రీపాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.— 42. శ్రీమ్యాడం అశ్వత్థప్పగారు, కల్యాణదుర్గం. — 43. శ్రీ కానుల శరభయ్యశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 44. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్పశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 45. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడుగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 46 శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 47. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 48. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, ఎం. ఎల్. ఏ., పెరియంబాడి. 49. శ్రీ నటకల రామనాధంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

నెల్లూరు జిల్లా: 50. బ్రహ్మచారి శ్రీబి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము. కనుపర్తిపాడు. — 51. శ్రీ జూపల్లి సూర్యప్రకాశరావుగారు, జూపల్లివారి నగరి, వెంకటగిరిటౌన్.

కృష్ణా జిల్లా: 52. ముక్కామల గారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీ నాగరత్నమ్మగారు, ఈడుపుగల్లు. — 53. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. బందరు. 54. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 55. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. 56. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 57. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 58. శ్రీ మాతంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 59. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి.— 60 శ్రీసమయమంతుల వెంకటరత్నం నాగమ్మగార్లు & రామన్న మాణిక్యాంబగారి స్మారకముగ శ్రీ వెంకటసుబ్బారావుగారు, ర్యాలి — 61 శ్రీ సమయమంతుల జగన్న కుమారులు జగ్గారావు, బుచ్చిరాజు, వెంకటరత్నంగారు, ర్యాలి. — 62. శ్రీ మానేపల్లి వీరభద్రరావుగారు, ర్యాలి.

పశ్చిమగోదావరి జిల్లా: 63. శ్రీ అబోతుల రామన్న గారు, పాలకొల్లు. – 64. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

నైజాం స్టేట్: 65. శ్రీ పి. వి. రంగారావుగారు, నల్గొండ. – 66. వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. – 67. శ్రీ నాగబండి విశ్వనాథంగారు, వరంగల్. – 68. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి,వరంగల్. – 69. శ్రీ గంటె రాజయ్యగారి లింగయ్యగారు, వరంగల్. – 70. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, వరంగల్. – 71. శ్రీతాటికొండ నాగయ్యగారు, వరంగల్. – 72. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, వరంగల్. – 73. శ్రీ మదూరు బసవలింగంగారు, వరంగల్. – 74. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్. – 75. శ్రీయాదా నారాయణగారు, వరంగల్. – 76. శ్రీ గుని శెట్టి నాగలింగంగారు, వరంగల్. – 77. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, వరంగల్. – 78. శ్రీగన్ను బుచ్చయ్యగారు, వరంగల్. – 79. శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, వరంగల్. – 80. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ – 81. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ – 82. శ్రీ చండా పుల్లయ్యగారు, వరంగల్ – 83. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు, వరంగల్ – 84. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, వరంగల్.

మైసూర్ రాష్ట్రం: 85. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్ వారు, హొస్పేట్ 86. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. – 87. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 88. శ్రీ కె. సంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. – 89. శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. – 90. శ్రీ కె. చౌడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి. – 91. శ్రీమతి కుసుమ భాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

మద్రాసు రాష్ట్రం: 92 శ్రీ శంకరనాయుడుగారు, కార్వేరు, నార్తార్కాడు జిల్లా. – 93. శ్రీ సి. ఎన్. నాగరాజశ్రేష్ఠిగారు, కొల్లేగాలం, కోయంబత్తూరుజిల్లా.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు–16.
2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వండవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మగారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.
4. కోనూరి సూరాయమ్మగారు, వెదిరేశ్వరం, తూర్పు గోదావరి.

---

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool Andhra,

# గ్రంథ సమాలోచనము.

## 1. బుద్ధగీత:— రెండవకూర్పు, వెల రూ. 1—8—0

కవి: సరస్వతీ కంఠాభరణ - విద్వాన్ - వేమల సూర్యనారాయణశర్మగారు- దొరకుచోటు:- శ్రీమతి వేమల గౌరీదేవి, హైస్కూలు వెనుకవీథి, తణుకుపోస్టు పశ్చిమగోదావరి జిల్లా.

జగద్విదితమైన బౌద్ధగ్రంథము ధమ్మపదమునకు కమ్మని పద్యానువాద మీ గ్రంథము. మొత్తము యిరవైఆరు వర్గములును తేటగీతికలలోను - ఆటవెలదులలోను అనువదింపబడినవి. కవి నిజమునకు కమ్మిభావ విహారి - అంతేకాదు - కమ్మిభాషా విహారికూడా.

నేను బుద్ధచర్య ననువదించు కాలమున దీని మొదటికూర్పు శ్రీ శుద్ధచైతన్య స్వామివారి అనుగ్రహమున నాచేతి కందినది. ఆయెడ ఎన్నితడవు లాగ్రంథమును చదివితినో - అంతేలేదు. రసికులు - ఆధ్యాత్మ రసికులు అవశ్య మాదరింపతగిన గ్రంథము.

## 2. శ్రీ లక్ష్మీనృసింహ వాస్తు లక్షణము, (అనుభవగృహవాస్తుసారము)

వెల రూ. 3—0—0

దొరకుచోటు:— జ్యోతిషకళానిధి కొండకమర్ల ఎద్దుల వెంకటరెడ్డిగారు. నేనేవాండ్లపల్లి, హిందూపురం తాలూకా (అనంతపురంజిల్లా.)

---

# ఆహ్వాన పత్రము

## శ్రీ శంకరజయంతీ సప్తాహ మహోత్సవము.

కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ శ్రీ శంకరానందాశ్రమమునందు ఏప్రెల్ 26-వ తేదీ మంగళవారం వైశాఖ శుద్ధ పంచమినుండి వారమురోజులు.

### —: ఉపన్యాసకులు :—

శ్రీ శ్రీ శ్రీ నిత్యానందస్వామివారు; కాళహస్తి శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణానందస్వామివారు, శ్రీ శ్రీ శ్రీ అశేషానందస్వామివారు, శ్రీ నిర్విషయానంద బ్రహ్మచారిగారు, శ్రీ బాలయోగిగారు, బ్రహ్మశ్రీ సాధు లక్ష్మీనృసింహశర్మగారు, బ్రహ్మశ్రీ కె. మల్లికార్జునశాస్త్రిగారు, శ్రీ గీతానంద (రుద్రారెడ్డి)గారు, మాతృశ్రీ లంకా భాగీరథమ్మగారు.

ఈ ఏడు రోజులు అఖండనామ సంకీర్తనము — సమష్టి గీతాపారాయణము — గీతాప్రవచనములు — గీతాభినయము — నగరసంకీర్తనము — ఆధ్యాత్మికోపన్యాసములు జరుగును.

ఈ ప్రకటననే ప్రత్యేకాహ్వానముగ భావించి అందరును విచ్చేసి శ్రీ ఆదిశంకరుల అనుగ్రహమునకు పాత్రులు కావలెనని ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

**ఆహ్వాన సంఘము.**

శ్రీ వేదవ్యాస ప్రెస్, ...